# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం మహానుభావులైన **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ద్వారకాదీష్ వాస్తు** వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

## http://dwarkadheeshvastu.com

Free Download Indian epic ×

dwarkadheeshvastu.com/Epic-List-of-Indian-Epics-in-Telugu.aspx

Hindi | Sanskrit | English | Gujrati | Bangali | Oriya | Telugu | Nepali | Marathi | Kannad | Asamiya | Urdu | Malyalam | Avdhi | Ved | Puran | Bhagwat | Ramayan | Geeta | Punjabi | Jain Dharm | Islam | Karm Kand

Dwarkadheesh Vastu

Home
Contact Us
हिन्दी वेबसाईट
Vastu Consultancy
Download Vastu Book
FREE Astrology Books

FREE Devotional Music (Mp3)
FREE Devotional Videos
FREE Devotional Books (PDF)
FREE Educational Books (PDF)
FREE Educational Videos
FREE Devotional Wallpapers

Dwarkadheesh Vastu
Like
3,663 people like Dwarkadheesh Vastu.
Facebook social plugin

A | B | C | D | E | F | G | H | I
J | K | L | M | N | O | P | Q | R
S | T | U | V | W | X | Y | Z

1. 12 Rashi Fal (Hindi)
2. 300 Saal Sikh Itihaas De Naal (English)
3. Aachar Manjari (Nepali)
4. Aadarsh Bhakti Prem (Telugu)
5. Aadarsh Dampatya Jeevan (Telugu)
6. Aadarsh Desh Bhakt (Hindi)
7. Aadarsh Manav Hridaya (Hindi)
8. Aadarsh Nari Sushila (Bengali)
9. Aadarsh Nari Sushila (Gujrati)
10. Aadarsh Nari Sushila (Tamil)

### Indian Epics in Telugu

1. Aadarsh Bhakti Prem (Telugu)
2. Aadarsh Dampatya Jeevan (Telugu)
3. Aadarsh Nari Sushila (Telugu)
4. Aadhyatm Ramayan (Telugu)
5. Aandhra Mahabhagwat Dasham Skandh (Telugu)
6. Agni Puranam (Telugu)
7. Aladdin Adbhutha Deepam (Telugu)
8. Alibaba Dongalu Katha (Telugu)
9. Amavasya Somavara Vratham (Telugu)
10. Amma Neeti Kathalu Katha (Telugu)
11. Amulya Samaya Ka Upyog (Telugu)
12. Anantapadmanabha Asthotram (Telugu)

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీపద్మ పురాణము

ఒకప్పుడు శౌనకాది మహా మునులున్న నైమిశారణ్యమును సకల పురాణవేత్త యైన సూతుడు వచ్చెను. అతడు, పృథుచక్రవర్తిచేసినయాగములో హవిస్సులు తారుమా రగుట చేతఅగ్నికుండమునుండిపుట్టి,వ్యాసునిశిష్యుడై సర్వపురాణములను రహస్యార్థములతో నేర్చుకొని అందరకును జెప్పుచు, పులకరింప జేసెడివాడు. అందుచే రోమహర్షణుడని పేరొందెను. అతనిని మహర్షులు ఆదరించి, "విష్ణువు నాభినుండి పుట్టిన పద్మము విషయమును, విష్ణువు మహత్త్వమును దెలిపెడి పురాణము నొకదానిని మాకు జెప్పు"మనియడిగిరి.సూతు డిట్లు చెప్ప నారంభించెను. "మునులారా!పద్మపురాణమని ఒక మహాపురాణము గలదు. కల్పాంతరమునందు జగము లన్నియు మహార్ణవమై, తిరిగి కల్పముమొదలైనపుడుమత్స్యరూపుడైనమాధవునిచేతవేదములతోపాటుఈ పురాణము గూడ ఉద్ధరింపబడినది. శ్రీహరి నాభినుండి మొలచిన పద్మముయొక్క విశేషములను జెప్పుచుండుటచేతను,పద్మకల్పమునజరిగినవిశేషములనువర్ణించుటచేతనుపద్మపురాణమని ప్రసిద్ధినొందెను.దీనినివిన్నవారికిజన్మజన్మాంతరపాపములునశించిమోక్షము గలుగును".

### త్రిపుర సంహారము

పూర్వము బాణాసురు డను రాక్షసుడు శివు నారాధించి, "త్రిభువనేశ్వర"మను లింగమును సంపాదించి పూజించెడివాడు. అతనికి ప్రధానపురములు మూ డుండెడివి. అవి ఆకాశములో విమానముల వలె తిరిగెడివి. అతడు వానిపై దిరుగుచు మునుల యజ్ఞములను, తపములను చెడగొట్టుచుండెను. దేవతలు భయభ్రాంతులై శివునితో చెప్పుకొనిరి. శివుడు నారదుని బిలిచి "బాణున కీ శక్తి, వాని భార్యల పాతివ్రత్యము వలన గలిగినది. వా రెప్పుడును భర్తనుగూర్చియే ధ్యానము చేయుచుందురు. నీవు వారి దృష్టినివ్రతదానముల మీదకు మరలించితివేని బాణుని మనము సాధింపగలము"అనగా విని నారదుడు, రాణుల యంతఃపురము జేరి వారిచేత పూజ లొంది, వ్రతముల మహత్త్వమును, దానముల వలన పుణ్యములను వర్ణించెను. పట్టపురాణి అనోపమ్య "మునీంద్రా!వ్రతములలోను,దానములలోనుఉత్తమమైనవానిని చెప్పు"మని యడిగెను. మిగిలిన రాణులును ఆసక్తి చూపిరి. నారదుడుతనపథకముపారినందుకుసంతోషించుచు "వేదవేత్తయైన భూసురునకు తిల ధేను దానము (చిమ్మిలితో చేసిన ధేనువు కావచ్చును లేదాతిలలతోసహాగోదానముకావచ్చును)చేసినచోఅక్షయమైనస్వర్గభోగములుగలుగును.

ఉపవాసవ్రతము చేసి యీ దాన మిచ్చినచో స్వర్గము నీ చేతిలో నున్నట్లే"అని చెప్పి బయలుదేరుచుండగా ఆమె "మహాత్మా!నీవే ఆ దానము పుచ్చుకొని మమ్ము తరింప జేయరాదా?అని యడిగిరి. "అమ్మా, నేను బ్రహ్మచారిని. తపస్విని. ఇవన్నియు నాకేల? ఒక కుటుంబికుని చూచి యిచ్చి మంచిది"అని వెళ్ళిపోయెను. రాణుల మనస్సులు భర్తృచింతన మాని వ్రతదానములపై బడెను. దానితో త్రిపురములందును ఎన్నో విపరీతములు పుట్టెను.("తిలాఃపునంతుమే పాపం " అని శ్రుతి. తిలలు సర్వపాపములను బోగొట్టును. అందుకే పీడ తొలగుటకు తిలదానము చేయుదురు.) శివుడు, మేరువును ధనుస్సుగాను,విష్ణువునుబాణముగాను,బ్రహ్మనుసారథిగానుజేసికొనిభూమి రథముకాగా, విల్లెక్కు పెట్టి, త్రిపురములును ఒక వరుసలోనికి ఎప్పుడు వచ్చునా యని యెదురు చూచుచు, అట్లు రాగానే బాణమును ప్రయోగించెను. వరుసగా రెండు పురములు అగ్నిదగ్ధము లయ్యెను.వెంటనేబాణాసురుడు వచ్చి "దేవా!నీ వరప్రసాదము వలన లభించిన పురముల నేల భస్మము చేయుచున్నావు?నన్ను చంపదలచినచో చంపుము. కాని నా త్రిభువన లింగమును కాపాడుము"అనగా శివుడు, "నీ పురములందు సాధుపీడ జరుగుచున్నందున ఇట్లు చేయవలసివచ్చినది. అది మానినచో ని న్నొక్క పురముతో బ్రతుకనిచ్చెదను"అనగాశివునియాజ్ఞ పై బాణుడు దుర్మార్గ కృత్యములు మానెను. వానిని శివుడుదయతో"ఒక్కపురముతోబ్రతుకు"మనిపంపివేసి,కాలినరెండుపురములలోనొకదానిని అమరకంటకమున(అమరావతిలో)పడునట్లును,రెండవదానిని శ్రీశైలములోబడునట్లునుచేసెను. బాణాసురుడుశివభక్తుడైసజ్జనులనుపీడించుటమానెను.(స్థూల,సూక్ష్మ కారణ దేహములను నశింపజేసి, తన భక్తులకు భగవానుడు మోక్షము ననుగ్రహించునని అంతరార్థము)

### ధర్మదేవుడు శాపము నొందుట

ఒకప్పుడు అత్రిపుత్రుడైన దూర్వాసుడు ధర్మస్వరూపమును దర్శింపగోరి ధర్మదేవతను గూర్చి తపముచేసెను. పదివేల యేండ్లు గడచినవి. ధర్మదేవత (యముడు కాదు) ప్రత్యక్షముకాలేదు.దూర్వాసునికికోపమువచ్చిధర్మదేవునిశపించుటకుసిద్ధపడెను.అప్పుడాయన ప్రత్యక్షమై"నీవంటికోపిష్ఠివానికితపస్సుఫలించునా?"అనగాదూర్వాసుడు"నీవెవ్వడ"వని యడిగెను.ధర్ముడు"నేనుధర్మమూర్తి"ననెను.దూర్వాసుడుమహాక్రోధముతో"నాకోపమును నీ వార్పగలవా?పదివేలేండ్లు గడచిన తరువాత ఇప్పుడు మేము కనబడితిమా? ఇన్నాళ్ళుమాకుప్రత్యక్షము కాకుండ ఏమి చేయుచున్నావు?ఇప్పుడైనను నాకోపమునకు జడిసి ప్రత్యక్ష మైనట్లు కనబడుచున్నది.

నీవుఇంతదుర్మదాంధుడవై,బ్రాహ్మణాపచారముఒకరాజువై,ఒకచండాలుడవైపుట్టుము" అనిశపించిలేచిపోయెను.ఆశాపమువలననివిదురుడుగాను,పాండుకుమారులలోజ్యేష్ఠుడైన ధర్మరాజుగాను, కాటికాపరితనముచేసినహరిశ్చంద్రుడుగానుధర్మమూర్తి జన్మించెను.

**గరుత్మంతుడు**

కశ్యపునిభార్యలలో వినత ఒకతె. ఆమె గరుడుని గన్న తల్లి. గరుడుడు మహాబలవంతుడు. తల్లినితనయాకలిదీరఅన్నముపెట్టుమనియడిగెను."నేనుదాసిగానుండినీకేమిపెట్టగలను? నీ తండ్రిని అడుగు"మనెను. గరుత్మంతుడు తండ్రియొద్దకు బోయి తన యాకలి తీరు మార్గముచెప్పుమనెను.ఆయన,"పశ్చిమసముద్రతీరమునమ్లేచ్ఛులున్నారు.వారినిభక్షించి నీయాకలితీర్చుకొను"మని చెప్పెను.అతడక్కడికిపోయిదొరికిన వారిని బట్టి తినుచుండగా ఒకనా డొకడు గొంతులో అడ్డము పడెను. లోనికి పోడు, పైకి రాడు, గరుడుడు వెళ్ళి తండ్రిని అడుగగా "నీ కంఠములో ఒక బ్రాహ్మణుడు అడ్డుపడినాడు"అని, ఆ బాపనితో "నీవు బయటకు ర"మ్మని చెప్పెను. వాడు "వీరందరు నా వారు;వీరిని విడిచి రా"ననెను. కశ్యపుడు గరుడుని జూచి "మ్లేచ్ఛుల నందరిని క్రక్కివేయు"మనెను. అత డట్లే చేసెను. (అతని యాకలి తీరుటకై, కశ్యపుడు "సముద్రములో గజ కచ్ఛపము (తాబేలు)లు రెండు పనిలేక పోరాడుచున్నవి. వానిని గొనిపోయి తిను"మనెను. గరుడుడా రెండింటిని రెండు కాళ్ళలో నిరికించుకొని, ఎక్కడ పెట్టికొని తిందునా యని చూచుచుండగా ఒక నేరేడు (జంబువు)చెట్టు పెద్దది కనిపించెను. దాని కొమ్మ పై వ్రాలగా అది ఫెళ ఫెళమని విరిగెను. అదిక్రిందబడినచోగోవులువిప్రులుచచ్చెదరేమోయనిముక్కున గఱచుకొని పోవుచుండెను. అతనిమహాబలమునుజూచిమాధవుడువానినితనకువాహనముగాజేసికొనదలచిభూసుర వేషముతో ఎదుటనిలిచి,"ఈనాబాహువుమీదవ్రాలి గజకచ్ఛపములను భక్షించు"మనెను. పక్షిరాజు నవ్వి, "ఇంత బరువును నీ చేయి భరింపగలదా?పిచ్చిమాటలాడకు"మనెను. "వ్రాలిచూడు"మనిబ్రాహ్మణుడనగా గరుడుడు, "నీ వెవ్వడ"వని యడిగెను. "తర్వాత తెలిసికొనవచ్చును ముందు నీ యాకలి తీర్చుకొమ్ము"నెను. ఏమో చూతమని గరుడుడు ఒక్క ఊపున ఆ చేతిమీద వ్రాలెను. బాహువు రవ్వంత గూడ చలించలేదు. చెట్టుకొమ్మను కొండకొమ్మున విడిచి గజకచ్ఛపములను భక్షించి,ఇంకనుఆకలితీరలేదనగా ఆయన " నా భుజము కొరికి మాంసమును దిను"మనెను. గరుడుడట్లేచేసెను.ఆకలితీరెను. శ్రీపతిప్రత్యక్షమై"నీవునాకు వాహనముగా నుండు"మనగా గరుడు డంగీకరించెను.

తండ్రియొద్దకు బోయి చెప్పగా అతడు సంతోషించి, "నీ తల్లి దాస్యమును పోగొట్టి ఆపైన వెళ్ళు"మనెను.గరుడుడు తల్లికి నమస్కరించి, "నీ కీ దాస్య మెట్లు కలిగె"నని యడిగెను. ఆమె, ఇట్లు చెప్పెను. "నేనును కద్రువయు స్నానమునకు బోయితిమి.ఆమె "అక్కా!రేపు చూడు.సూర్యునిగుఱ్ఱములునల్లగానుండును"అనెను.నేనుకాదంటిని.ఓడినవారు గెలిచినవారికి దాస్యము చేయవలెనని పందెము వేసికొంటిమి. మరునాడు చూడగా సూర్యుని పచ్చని గుఱ్ఱములు నల్లగా కనబడెను. అప్పటినుండి నేను మీ సవతి తల్లికి దాస్యము చేయుచున్నాను. ఆమె కొడుకులను (పాములను) బ్రతిమాల, గుఱ్ఱములకు చుట్టుకొనియుండి నల్లగా కనబడునట్లు చేయుడని వారిని పంపినదని తరువాత తెలిసినది. ఏమియు చేయలేక ఊరకుంటిని". గరుడుడు కద్రువ దగ్గరకు బోయి మ్రొక్కి, "నా తల్లిని దాస్యము నుండి విడుదల చేయుటకు నీ కేమి కావలె"నని యడిగెను. ఆమె అమృతభాండమును దెచ్చి యిమ్మనెను. అతడు అమృతభాండమును దెచ్చుచుండగా ఇంద్రుడు అడ్డుపడి వజ్రాయుధముతో కొట్టెను. ఆ దెబ్బకు గరుడుని దేహమునుండి ఒక ఈక కూడ రాలలేదు. ఇంద్రుడు, "పాములకు అమృతము పోసినచో లోకములకు చాల హాని కలుగును. దీనిని నీ సవతితల్లి కియ్యగానే నే నపహరింతును. అంగీకరింపు"మనెను. గరుడు డట్లే యనెను. సవతి తల్లికి సుధాకలశ మిచ్చెను. తల్లిని దాస్యమునుండి విడిపించెను. ఇంద్రుడు అదృశ్యరూపములో వచ్చి అమృతకలశమును గొనిపోవుచు అక్కడ విషభాండము నుండెను. అదే అమృత మనుకొని కద్రువ తన సర్పకుమారులకు బోసెను. అప్పటినుండి పాములు విష జంతువు లైనవి.

### సీతాదేవికి చిలుక శాపము

అదిమిథిలానగరములోనిఅంతఃపురస్త్రీలఉద్యానవనము.సీతాదేవిచెలికత్తెలతో విహారమునకు వచ్చెను.ఒకచెట్టుమీదచిలుకలజంటముచ్చటలాడుకొనుచుండెను.అవివాల్మీకిఆశ్రమము నుండివచ్చినవి.మగచిలుక,"ఈదేశపురాజుగారికేసీత నాగటిచాలులో దొరకినదట.ఆమెను శ్రీరాముడుశివధనుర్భంగముచేసిపెండ్లాడునట"అనిభార్యకు చెప్పుచుండెను. అది విన్న సీత,ఆరెండుచిలుకలనుబట్టితెప్పించెను.వానితోసీత,"మీరెవరినిగురించి మాట్లాడుచున్నారు? ఎతనునేనే.నన్నుగురించియేనా?ఆరాముడెవడోచెప్పుడు.సంగతులు మీకెట్లుతెలిసినవి? "అనిఅడుగగా"మేమువాల్మీకిఆశ్రమములోనివారము.విహారమునకైవచ్చినాము.వాల్మీకిముని రామాయణము అని ఒక గ్రంథము వ్రాయుచున్నాడు.అందులోనికథచెప్పుచున్నాము. రాముడుఅయోధ్యకుయువరాజు"అని శుకములు చెప్పి, తమ్ము వదలుమని ప్రార్థించెను.

"ఆ శుభకార్యము జరిగిన తరువాత మిమ్ము విడిచెద"నని సీత యనెను. అవి "మేము స్వేచ్ఛగాతిరిగెడివారము.పంజరములలోఁ ఉండలేము.అదియునుగాక నా భార్య చూలాలు. శ్రమకుఓర్వలేదు.దయతోవిడిచిపెట్టు"మనికోరెను.సీత,"అయినచోప్రసవమగునంతవరకు ఆడుచిలుక నా యొద్దనేయుండును. నీవు పొమ్మ"ని మగచిలుకను విడిచెను. అది, "తల్లీ! దీనిని విడిచి నేను బ్రతుకలేను. కరుణించి మమ్మిద్దరను విడిచిపెట్టు"మని దీనముగా ప్రార్థించెను. కాని సీత వినలేదు. ఆడచిలుక, సీతతో, "నా భర్త నన్ను విడిచి బ్రతుకలే ననుచున్నాడు.నేనును అతనిని విడిచి బ్రతుకలేను. కావున మమ్ము దయజూడు"మనెను. సీత వినలేదు. మగచిలుక యేడుపు ఆడుచిలుక గుండెలు పగులగొట్టగా అది సీతను జూచి "యింత కఠినురాలవై గర్భవతినైన నన్ను నా భర్తనుండి విడదీసినావు కావున, నీవుకూడ గర్భవతివై భర్తను ఎడబాసి దుఃఖపడెదవు"అని శపించి ప్రాణము విడిచెను. మగచిలుక "నా భార్యను అన్యాయముగా చంపినావు. కావున నిన్ను నీ భర్త విడుచుటకు మూలకారణుడైన చాకలివాడనై జన్మించి పగ తీర్చుకొందు"ననుచు వెళ్ళి గంగానదిలో పడి మరణించెను. సీతను రాముడు అడవిలో విడుచుటకు ఇదియే కారణము.

## పూర్వకల్పములోని రామాయణము

పద్మకల్పమునకు పూర్వము వైరాజకల్పములోని కథయిది. రామునకు జాంబవంతుడు ఆ కథను జెప్పెను. దశరథుడను రాజుండెను. అతనికి కౌసల్య, సుమిత్ర,సురూప,సువేష అని నలుగురు భార్యలు. అతని కొక కొడుక. వేటకు బోయి ఒక భల్లూకము దెబ్బకు మరణించెను.ఇంకసంతానములేదు.దశరథుడుసాధ్యరాజుపైదండెత్తి ఓడించి బంధించెను. అతని కొడకు భూషణుడు ఎదిరించగా వానిని ఎక్కువ నొప్పించక బంధించెను. అతనిని జూడగానేదశరథునకుచనిపోయినతనకొడుకుజ్ఞప్తికివచ్చెను."ఏమివ్రతముచేసియిటువంటి కొడుకునుగన్నా"వనిసాధ్యరాజునడిగెను."ఏడాదిపాటుఏకాదశీవ్రతముచేసివిష్ణువుదయవలన కన్నా"నని అతడు చెప్పగా వారిని సత్కరించి విడిచిపెట్టెను.తానుగూడ ఏకాదశీవ్రత మొక్కఏడుచేసిపూర్ణాహుతి చేయగా చతుర్భుజుడైన యజ్ఞపురుషుడుఆఅగ్నికుండములో నుండివచ్చివరముకోరుమనగాదశరథుడు"నలుగురు కొడుకులు గావలె"నని కోరెను. అతడావరమిచ్చిచరు(అన్న)పాత్రలోలీనమయ్యెను.అదితిన్నరాణులునలుగురికిపుత్రులుపుట్టిరి. కౌసల్యకురాముడును,సుమిత్రకులక్ష్మణుడును,సురూప(కేకయరాజ పుత్రిక)కు భరతుడును, సువేషకుశత్రుఘ్నుడునుబుట్టిరి.పిల్లలు పెరుగుచుఆడుకొనుచుండగారామునిఒకబ్రహ్మ రాక్షసుడావహించెను.వశిష్ఠుడుమంత్రోదకముచల్లగాఈవలకువచ్చి,ఆయనకు నమస్కరించి,

"నేనువేదశాస్త్రాలుచదువుకొన్నవిప్రుడను.అడిగిన విద్యార్థులకు చెప్పక బ్రహ్మరాక్షసుడనైతిని. రామునిపట్టినచోనీవల్లమోక్షమొందవచ్చుననియిట్లుచేసితిని. న న్ననుగ్రహింపు"మనెను. వశిష్ఠుడు,"గంగలోమునిగివిశ్వనాథునిసేవించిముక్తినొందు"మనెను.దశరథుడురామాదులకు ఉపనయనము చేసి, వేదశాస్త్రములు, క్షత్రియోచిత విద్యలును నేర్పించెను. రామునకు పెండ్లిచేయ దలచి రాజు లందరకును చెప్పెను. మిథిలాపతియైన విదేహుడు, తనకు యజ్ఞాగ్నికుండములోదొరికినసీతనుఇత్తుననిబ్రాహ్మణులనంపెను. పెండ్లి నిశ్చయమైనది. దశరథాధులుతరలివెళ్ళిరి.అప్పుడునారదుడువిదేహుని వద్దకు వచ్చి, "మీ వంశాచారము చొప్పున స్వయంవరము చాటింపక ఇట్లు చేసితి వేమి?ఆచారము తప్పరాదు"అనగా దశరథుని అనుమతితో విదేహుడు కుమార్తెకు స్వయంవరము చాటించి, రామునికి పిల్ల నిచ్చు భాగ్యము కలిగించి కొరవము కాపాడుమని శంకరుని ప్రార్థించెను. ఆయన ప్రసన్నుడైఒకవిల్లునిచ్చి"దీనినెక్కు పెట్టిన వానికి సీత నిమ్మ"ని చెప్పిఅదృశ్యు డయ్యెను. రాజులు వచ్చి విల్లును కదిలింపలేక భంగపడిరి. విశ్వామిత్రుడు కూడ ప్రయత్నించి భంగపడెను. శ్రీరాముడు విల్లు నెక్కు పెట్టగా సీత అతనిని వరించెను. అది చూచి దేవ, దానవ, మానవనాథు లందరును రామునిపై దాడిచేసిరి. అతడు వారినందర నోడించి సీతనుపెండ్లాడిస్వనగరమునకు వచ్చెను.రామునకు పట్టాభిషేకము చేయబోయిన దశరథుని, సురూప వరములు కోరెను. వసిష్ఠుడు రాజుతో "నీ కొడుకు భూభారమును తగ్గించుటకుఅవతరించినమాధవుడే"యని చెప్పి రాముని వనవాసమునకు అనుమతింపు మనెను.రాముడుసీతాలక్ష్మణులతోవనవాసమునకువెళ్ళెను.రావణుడుసీత నపహరించగా వెదకుచుబోయి, ఒక మామిడి చెట్టుమీద నున్న కోతిని జూచి, "నీ వెవ్వడవ"ని యడిగెను. ఆ వానరుడు "నేను హనుమను. సుగ్రీవుడను వానరరాజు బంటును"అనగా రాముడు, "మీరాజునుచూడవలె"ననెను.హనుమ సుగ్రీవుని దీసికొనివచ్చెను. ఒకరి చరిత్ర యొకరికి చెప్పికొనిరి. సుగ్రీవుడు సీత నగలు రామునికి చూపెను. పరస్పరము సహాయము చేసికొనుటకు ప్రతిజ్ఞ చేసికొనిరి. వాలి సుగ్రీవుల యుద్ధములో రాముడు వాలిని గొట్టెను. తారవచ్చిరామునిజూచి, "నీవు క్షత్రియధర్మము నిట్లేల పాడుచేసితివి?సుగ్రీవుని రాజ్యమును భార్యను అపహరించినందుకు వాలిని శిక్షించినావుగదా!సుగ్రీవుడు చేసినది మాత్రమేమి?అరువదివేలయెనుబది(60,080) సంవత్సరముల క్రిందట, వాలి దుందుభితో పోరాడుచు ఒక బిలములో నుండిపోయెను. సుగ్రీవుడు గుహను మూసి వచ్చి నన్నును, వాలిరాజ్యమునుస్వాధీనముచేసికొనెను.ఏడాదిగడిచెను.వాలిదుందుభినిజంపితిరిగి వచ్చెను.

ఆనాడే నీ తండ్రి దశరథుడు గూడ రాజ్యాభిషిక్తు డయ్యెను. వాలి, సుగ్రీవుడు చేసిన దానికి ప్రతీకారముగా, వాని భార్యను రాజ్యమును అపహరించెను. ఇప్పుడు వాలిది తప్పైనచో, అప్పుడు సుగ్రీవునిది కూడ తప్పు కాదా?వానిని చేరదీసితి వేమి?"అని నిలువదీసెను. రాముడు "ఆనాటి రాజు చేయవలసిన పని యది. ఇప్పు డీ యధర్మము చేసిన వాలిని శిక్షించుట నా ధర్మము"అని యామెకు సమాధాన మిచ్చి వాలికి మోక్ష మిచ్చి సుగ్రీవునికి రాజ్య మిచ్చెను. అతడు హనుమంతుని బిలిచి సీతా వృత్తాంతమును తెలిసికొని రమ్మని పంపెను. అత డొక్క గంతులోసముద్రముదాటి లంకలో సీతను వెదకి, ఆమెకు ధైర్యము చెప్పి, లంకను గాల్చి రాక్షసులను జంపి తిరిగివచ్చి సీత సంగతి రామసుగ్రీవులకు చెప్పెను. రాముడు వానరసేనతో సముద్రతీరమునకు వచ్చి, ఈశ్వరుని ప్రార్థించి,అతడుప్రత్యక్షముకాగా,లంకకుచేరుడుపాయమునుజెప్పుమనెను.శివుడుతనచేతిలోని వింటినిసముద్రముమీదవంతెనగావేసి,"దీనిపైనుండిసైన్యములతోనడచిలంకకుజేరు"మని చెప్పగా రాముడట్లే లంకకు వెళ్ళెను.వానరరాక్షసులకు ఘోరయుద్ధ మయ్యెను. రెండు వైపులవారునుజచ్చుచుండిరి.ఇంద్రజిత్తులక్ష్మణునిచేతిలోచచ్చెను.అతికాయ మహాకాయులను రాక్షసులుకోతులను బట్టి మ్రింగుచుండగా హనుమజ్జాంబవంతులు వారి నడ్డుకొని పోరాడి తోకలతోబంధించిరామునిముందుపడవేసిరి.రాముడువారితో"మీరావణుడుఏమనుచున్నాడు? యుద్ధమే చేయునా?లేక సీత నప్పగించి మమ్ము శరణు వేడునా?"అని అడిగెను. వారు, "మేమునీతోమాటాడుటకే పట్టుపడినాము. నీ యభిప్రాయము గ్రహించుటకే వచ్చినాము. విద్యున్మాలివానరులనుసంహరింపవలెననియు,మేముమీతోయుద్ధము చేయవలెననియు రావణుడు నిర్ణయించెను. తాను కుంభకర్ణాదులతో పుష్పకముపై వచ్చి నిన్ను పట్టి కట్టి సీతముందే వధించుటకు నిర్ణయించినాడు"అని పలికిరి. సుగ్రీవుడు కోపముతో వానిని జంపుదు ననెను. రాముడు, అది పని కాదని, వారికి మర్యాద చేసెను. వారు రాముని యౌదార్యమునకు ముగ్ధులై నమస్కరించి, "రామచంద్రా!రావణుని కోట వాకిట ఐదు ముఖాలుగల ఒక కొయ్య (బొమ్మ) యున్నది. దానిని నొక్క బాణముతో ఐదు ముక్కలుగా ఖండించినవాడురావణునిజంపుననిపూర్వముశుక్రుడు చెప్పినాడు.నీవట్లుచేయగలిగినచో నీచేతిలో రావణుడు మరణించు"నని చెప్పి, "మే మీ యుద్ధములో జనిపోయినను మా పిల్లలను మాత్రము రక్షింపు"మని ప్రార్థించిరి. రాముడు పిల్లల కభయ మిచ్చెను.వెంటనే రాము డొక్క బాణముతో ఆ కొయ్యబొమ్మను ఐదు ముక్కలుగా జేసెను. రాముడొక నాటి యుద్ధములో ఒక్క బాణముతో రావణుని కొట్టగా భరింపలేక ఇంటికి పారిపోయెను.

విభీషణునిబిలిచిచేయదగినకార్యమేమనియడుగగా,అతడు"నీకుచెప్పగలవాడనా?అడిగినావు కావునచెప్పుచున్నాను.శత్రుబల మెక్కువ యని నీ కిప్పు డర్థ మైనది కదా!బలవంతులతో విరోధముక్షేమము కాదు. సీత నొప్పగించి, నీవు బ్రతికి, మమ్ముకూడ బ్రతికింపు"మనెను. రావణుడుఆగ్రహించి,"నీవు అసలు రాక్షసుడవేనా?ఆ పౌరుషము నీ కున్నదా?శత్రువును శరణు వేడెదనా?అది నపుంసకులు చేసెడి పని. నీ వింక నా దగ్గర ఉండకుము పో"మ్మని లేచికాలితోదన్నెను. విభీషణు డా యవమానమునకు ఓర్వలేక రామునిసన్నిధికిబోయెను. రామరావణయుద్ధములోరాముడెంతప్రయత్నించిననురావణునిజంపలేకపోయెను.విభీషణుని వంకజూడగాఅతడు,రావణునిపాదములనుతెగగొట్టుమనిసంజ్ఞచేసెను.రాముడట్లే చేయగా రావణుడుయుద్ధరంగములోబడిమరణించెను. తరువాత కుంభకర్ణాదులు వచ్చి యుద్ధము చేసిరి.వారినిరాముడునిశితాస్త్రములతోసంహరించెను.విభీషణునిలంకారాజ్యమునకురాజునుజేసి, అగ్నిశుద్ధయగుసీతతోనురాక్షసవానరులతోనుఅయోధ్యకువచ్చుచు,లంకలోరావణునిపేరనొక యీశ్వరునిప్రతిష్ఠించి,సముద్రముదాటివచ్చిరామేశ్వరములోతనపేరనొకశివలింగప్రతిష్ఠ చేసివచ్చిపట్టాభిషిక్తుడై,ధర్మ దేవతనాలుగుపాదములతోనడుచునట్లురాజ్యపాలనము చెసను.

**శ్రీరాముని యశ్వమేధము**

శ్రీరాముడు అపవాదభయముచే సీతనుఅడవిలోవిడిచిన తరువాత, తాను రావణుని జంపి బ్రహ్మహత్య చేసినందుకు పాపపరిహారార్థముగా అశ్వమేధయాగము చేయ దలపెట్టెను. స్వర్ణసీతాప్రతిమతో సంకల్పము జరిగినది. అశ్వమును పూజించి విడిచిరి. దాని వెనుక శత్రుఘ్నుడునుకుమారులునువెళ్ళిరి.రుక్మాంగదుడనువాడుగుర్రమునుబట్టుకొనగాశత్రుఘ్నుడు వానినిజయించెను.తరువాతఆయశ్వముసరేవానదిలో మునిగిపోయెను. హనుమంతుడును శత్రుఘ్నుడును పాతాళమునకు పోయిరి. అక్కడ నొక కన్య కనబడి, "రామ కార్యమున సహాయముచేయుటకేనేనీయశ్వమునుదెచ్చినాను.దీనినివీరమణియనువాడుపట్టుకొనును. వాడీశ్వరునివరముచేఎవ్వరికినిఅజేయుడు.వానినిలొంగదీసికొనుటకొకమంత్రమునీకిచ్చెద"నని శత్రుఘ్నునకామంత్రమునుపదేశించెను.అశ్వమునువీరమణిపట్టుకొనెను. అతనితో రణము చేయుచుండగాశివుడుఅడ్డమువచ్చెను.శత్రుఘ్నునకుఅతనితోయుద్ధమయ్యెను.శివునిత్రిశూలము దెబ్బకుశత్రుఘ్నుడుమూర్ఛపోగా హనుమంతుడు శివునితో పోరాడెను. శివుని రథమును విరుగగొట్టెను.శూలమువేయగావిరిచివేసెను.హనుమరాళ్ళవానకురిపించగాశివుడువానిని తప్పించుకొనులోగాతోకతోఅతనినికొట్టెను.శివుడతనిశక్తికిమెచ్చి,"నీకేమివరము కావలె"ననగా శత్రుఘ్నుని

బ్రతికించుటకుసంజీవనితెత్తును.అంతవరకువీరినికాపాడుచుండుమనిద్రోణపర్వతమునకు బోయి అక్కడివారిని జయించి సంజీవనౌషధిని తెచ్చి రామానుజుని బ్రతికించెను. శత్రుఘ్నుడు కన్య యిచ్చిన సమ్మోహనాస్త్రముచే వీరమణిని వశపఱచుకొనెను. వాల్మీకి ఆశ్రమమునకుఅశ్వమువెళ్ళగాకుశలవులుపట్టుకొనిరి.అశ్వమునుకుశలవులువదలకపోవుటచే శత్రుఘ్నుడు వారిని యుద్ధములో గెలువ జూచెను. కాని కుశుని బాణముచే మూర్ఛిల్లెను. ఆంజనేయుడు చెట్టు నొకదానిని కుశునిపై వేయగా అతడు దానిని భగ్నముచేసి అతనిని సంహారాస్త్రముతోగొట్టెను.హనుమమూర్ఛపోయెను.సుగ్రీవుడతనిపైకిరాగావారుణాస్త్రముచే బంధించివేసెను.అశ్వరక్షణకైవచ్చినఅంగదపుష్కలాదులనుపడగొట్టికుశలవులుఅశ్వమును దెచ్చిసీతకుజూపిరి.ఆమెవారినిమందలించి,రామయాగమునకు విఘ్నము కలిగింపరాదని చెప్పి,సూర్యుని ప్రార్థించి రణములో పడిపోయినవారిని బ్రతికించి, అశ్వము నిప్పించెను. వారుఅశ్వముతోఅయోధ్యకుచేరిసీతాకుశలవులవృత్తాంతముచెప్పగా,రాముడువారినిఅయోధ్యకు పిలిపించెను.సకలజనులఆమోదమునుబొందిసీతతోగలిసియాగముపూర్తిచేయుటకైఅశ్వమును సంహరింపబోగా,రామునిచేయితగిలిఅదిదివ్యరూపముధరించి,"తానొకబ్రాహ్మణుడననియు, ఆడంబరముతోజనులనువంచించుచుధనసంపాదనచేయుచుండగాదుర్వాసుడుశపించెననియు, రామునిచేయి తగిలి విముక్తి నొందితి"ననియు చెప్పి దేవలోకమునకు బోయెను.రాముడు వసిష్ఠాదిమహామునులతోనాలోచించికర్పూరముతోహోమములుచేసిదేవతలనాహ్వానించగా వారువచ్చి హవ్యములు స్వీకరించిరి. పూర్ణాహుతియు, అవబృథస్నానమునుఅయ్యెను. (యజ్ఞసమాప్తివేళ చేయు పవిత్రస్నానము అవబృథము. దీనివలనదోషములుతొలగును.) ఈయాగపశువిట్లగుటచేతరాముడుతరువాతమూడశ్వమేధయాగములుచేసిబ్రహ్మహత్యాదోష విముక్తుడై, సీతతోను కుశలవులతోను, సోదరులతోను గలిసి సుఖముగా నుండెను.

**విభూతి మహిమ**

కైలాసమునుండి శంకరుడు విప్రవేషముతో నొకనాడు రామునొద్దకు వచ్చెను. రాముడు "తమనామమును,నివాసమునుచెప్పు"డనగాఆయన"నాపేరుశంభుడు,కైలాసమునా నివాసము"అనగాఅతనిని శంకరుడుగా గ్రహించి రాముడు విభూతిమహిమను చెప్పుడని యడిగెను.శివుడుచెప్పసాగెను."రామా!భస్మమహత్త్వమునుజెప్పుటకుబ్రహ్మాదులకుగూడ శక్యముగాదు.బట్టమీదిచారలను అగ్ని కాల్చినట్లు, మన నుదుట బ్రహ్మ వ్రాసిన వ్రాతలను గూడ తుడిచివేయు శక్తి భస్మమున కున్నది. విభూతిని మూడు రేకలుగా పెట్టుకొన్నచో త్రిమూర్తులను మన దేహముమీద ధరించిన ట్లగును.

ముఖమున భస్మమును ధరించిన నోటిపాపములను (తిట్టుట - అభక్ష్యములను దినుట అనుపాపములు),చేతులపైన ధరించిన చేతిపాపములను (కొట్టుట మొ॥) హృదయముపై ధరించిన మనఃపాతకములను (దురాలోచనలు మొ॥), నాభిస్థానమున ధరించుట వలన వ్యభిచారాది దోషములను, ప్రక్కలందు ధరించుట వలన పరస్త్రీ స్పర్శదోషములను పోగొట్టును. పాపములను భర్త్సనము చేసి (బెదరించి) పోగొట్టునది గాన భస్మము అను పేరు దీనికి గలిగెను. భస్మముమీద పండుకొన్నను, తిన్నను, ఒడలికి పూసికొన్నను పాపములు భస్మీభూతము లగును. ఆయువు పెరుగును. గర్భిణీస్త్రీలకు సుఖప్రసవము గలిగించును.సర్ప వృశ్చికాదివిషములనుహరించును.భూతపిశాచాదులనుపారద్రోలును. వశిష్ఠవంశములో ధనంజయుడను విప్రుడు గలడు. అతనికి వందమంది భార్యలు, వందమంది కొడుకులు. వారికి తన ధనములను సమానముగా పంచి యిచ్చి ఆ విప్రుడు గతించెను.కొడుకులుఅసూయతోను,దురాశతోనుఒకరిధనములకొకరాశపడుచుతన్ను కొనసాగిరి.వారిలోకరుణుడనుకొడుకు,శత్రువిజయముసాధించవలెనని గంగాతీరమున కేగిస్నానమాడి తపము చేయవలెననుకొని మునుల సేవచేయుచుండగా ఒక విప్రుడు నృసింహదేవునికి ప్రీతియని ఒక నిమ్మపండు దెచ్చి అక్కడ పెట్టెను. దానిని వీడు వాసన చూచెను.అందుకుమునులాగ్రహించిఈగవైపొమ్మనిశపించిరి.వీడువేడుకొనగాపూర్వస్మృతి నిచ్చిరి. అంతట ఏడ్చుచు వెళ్ళి భార్యతో చెప్పెను. ఆమె పతివ్రత. చాల విచారించెను. ఒకనాడీసంగతితెలిసివానిసోదరులు పట్టి చంపిరి. అతని భార్య ఈగ దేహమును తీసికొని అరుంధతిదగ్గరకుబోయిప్రార్థింపగాఆమె, మృత్యుంజయ మంత్రముతో అభిమంత్రితమైన విభూతిని జల్లి, కరుణుని బ్రతికించెను. మరొకసారి దాయాదులు కరుణుని జంపి యింటి ముందు పారవేసిరి. అతని భార్య శుచిస్మిత భర్త దేహముతో వనములలో దిరుగుచుండగా దధీచమునికనబడెను.ఆమెయీతనికివిషయమంతయునుజెప్పిప్రార్థింపగా,ఆయన"ఈభస్మముతో నాబ్రహ్మహత్యాపాపమునుపరమశివుడుపోగొట్టెను.దానినేఇతనిపైచల్లుచున్నా"నని చల్లెను.అతడు శాపవిముక్తుడైజీవించెను.దేవతలుగూడభస్మప్రభావమునుపొగడిరి. కరుణ దంపతులు దధీచమునిని తమ యింటికి పిలిచి భోజనము పెట్టిరి. అతడు వారిని దీవించి వెడలిపోయెను. ఆవుపేడపిడకలనుశతరుద్రియ(నమకము)మంత్రము చెప్పుచు కాల్చి భస్మముచేయవలెను.దానిని"త్ర్యంబకం"మంత్రముతోను,"సద్యోజా"తాదిమంత్రములతోను ధరించవలెను. మంత్రములు రాకున్నచో ప్రణవము నుచ్చరించుచు ధరింపవలెను. శూద్రాదులు "నమశ్శివాయ"మంత్రముతో ధరింపవలెను.

శ్రాద్ధములు - ముఖ్యాంశములు

బ్రాహ్మణుల సంఖ్య : శ్రాద్ధములందు విశ్వేదేవస్థానమున ఇద్దరిని, విష్ణుస్థానమున ఒక్కనిని,పితృస్థానమునముప్పురిని బ్రాహ్మణులను బెట్టవలెను. లేదా విశ్వేదేవస్థానమున ఒకరిని,పితృస్థానమునఒకరినినియమించవలెను.ఎంతకలవాడైననుఇంతకన్నశ్రాద్ధవిస్తారము చేయరాదు. బ్రాహ్మణులు దొరకనిచో దర్భ ఉంగరమునుగాని, శివలింగమును గాని సాలగ్రామమునుగాని ఆ స్థానములో నుంచి శ్రాద్ధము జరుపవలెను. ఆ యన్నమును అగ్నిలో వేయవలెను. తరువాత నైనను దక్షిణ ఒక బ్రాహ్మణుని కియ్యవలెను. (మన ప్రాంతములో గంధపు చెక్క నుంచు ఆచార మున్నది.)

పవిత్రధారణము : శ్రాద్ధారంభమునందును, పాద్యము తరువాతను, విశ్వేదేవార్చనము తరువాతను, పితరుల అర్చనము తరువాతను, పిండ శేషము నాఘ్రాణించిన పిదపను, వికిరము తరువాతను, శ్రాద్ధాంతమునందును (తర్పణము కొఱకు) పూర్వ పవిత్రములు వదిలిక్రొత్తపవిత్రములుధరించవలెను.పవిత్రహస్తుడైఆచమనముచేయరాదు.80గురువిందగింజల యెత్తున బంగారముతో పవిత్రము చేయించి ధరించినచో ఆ కర్మము సఫల మగును. సువర్ణపవిత్రముతోసమానమేదియుసాటిరాదు.(దర్భముడిఉంగరము).దేవతలకుప్రదక్షిణముగను, ఉపవీతిగానచేయవలెను. పితరులకు అప్రదక్షిణముగాను అపసవ్యముగాను చేయవలెను.

పాద ప్రక్షాళనము : మండలమునకు పశ్చిమభాగమున స్వాగతమును పాద్యమును ఇచ్చి,మండలముమీదభోక్తకుకాళ్ళుకడుగవలెను.దేవపాదోదకముశిరమునచల్లుకొనవలెను. పితృపాదోదకమును శిరముపై చల్లుకోరాదు. పితృమండలమును తాకిన చాలును.

శ్రాద్ధమునందు ఆచమనములు : ప్రారంభముననను, పాద్యము తరువాతను, విష్టరము లిచ్చినతరువాతను,వికిరపిండముపెట్టినపిమ్మటను,పిండప్రదానముతరువాతను,చిట్టచివరను కర్తఆరుసార్లుఆచమించవలెను.భోక్తలుపాదప్రక్షాళనానందరమందునుభోజనానంతరమందును రెండుచోట్ల ఆచమించవలెను.

సవ్యాపసవ్య నిర్ణయము : ప్రాణాయాయముననను, హోమసమయము లందును, ప్రదక్షిణ నమస్కారములప్పుడును,సూక్తపారాయణములందును,అధిశ్రవణముపఠించునప్పుడును, వడ్డనచేయునప్పుడును,పిండశేషాఘ్రాణమునందును,దక్షిణతాంబూలము లిచ్చునప్పుడును విసర్జనసమయమునందునుదప్పపితృకార్యమునందంతటనుప్రాచీనావీతముగా నుండవలెను. దేవకార్యమునందంతటనుసవ్యమే.కర్తృభోక్తలనియమము:కర్తశ్రాద్ధమునకుపూర్వదినమందును, శ్రాద్ధమునాడును మధ్యాహ్నభోజనము మాత్రము (ఏకభుక్తము) చేయవలెను.

భోక్త,శ్రాద్ధభోజనముతరువాతరాత్రిభుజింపరాదు.భోక్తలకుతేనెవడ్డించుట:మధుమంత్రముతో తేనెవడ్డింపవలెను.తేనెలేనిచోమంత్రపఠనమైననుచేయవలెను.ఆదిపితరులకుఅమృతకల్ప మగును.తేనెకు బదులుగా బెల్లము వడ్డించినచో శ్రాద్ధము చెడిపోవును.సంబంధ, నామ, గోత్రములుచెప్పినఫలము:సంకల్పమునందును,క్షణములిచ్చునపుడును,పాద్యమునందును, ఆసనమిచ్చునపుడును,ఆవాహనమందును,అర్ఘ్యమిచ్చువేళను,గంధాదిపంచోపచారములందును, అన్నదానవేళను,పిండప్రదానవేళను,గంధాదిపంచోపచారములందును,అన్నదానవేళను, పిండప్రదానవేళను,అంజనాభ్యంజనములందును,అక్షయతిలోదకదానములిచ్చునపుడును, (స్వధోక్తికాలమందును)సంబంధ, (చట్టరికము) గోత్ర, నామము లుచ్చరించుచు శ్రాద్ధము చేసినచోఆయన్నమువాయురూపమునఅనేకవిధములుగామారి,వారుదేవతలైనచో అమృతముగాను,గంధర్వు లైనచోభోగవస్తువులుగాను,మాంసాహారులైనచోమాంసముగాను, యక్షులైనచోపానీయముగాను,శిశువైనచోపాలుగాను,సర్పములైనచోగాలిగాను,ప్రేతలైనచో రక్తముగాను,మనుష్యు లైనచోఅన్నముగాను,పశువులైనచో గడ్డిగాను, చెట్లైనచో నీరుగాను, అందుచుండును.తిలతర్పణము:దర్శ (అమావాస్య) శ్రాద్ధమందును, యుగాది, మన్వాది, సంక్రాంతి,పూర్ణిమాశ్రాద్ధములందును,విప్రులనిమంత్రణమైనతరువాతగాని,పాకారంభ మైన తరువాతగాని శ్రాద్ధాంగతిలతర్పణము చేయవలెను. వార్షిక శ్రాద్ధమునందును, ఒక్కరోజు పెట్టిన మహాలయ శ్రాద్ధమందును పరదినమున సూర్యోదయముకాక ముందే శ్రాద్ధాంగతిలతర్పణము చేయవలెను. నదిలో స్నానము చేసినచో నది నీళ్ళతోనే నదిలో తిలోదకములు విడువలెను. ఇంటిలోనైనచోఒక్క చేతితోనే,తిలోదకములువిడువవలెను. తల్లిదండ్రులులేనివాడు నదీస్నానమునకు బోయినచో పితృదేవతలు వాని వెనుకనే వెళ్ళుదురు.వాడుస్నానముచేసి తర్పణము చేయకుండ బట్టలు పిండుకొన్నచో పితరులు శపించి వెళ్ళిపోదురు. స్నానము తర్పణముతో ముగియవలెనని మహర్షులు చెప్పిరి.

**గాయత్రి చరిత్ర**

మునుపు ఒకప్పుడు బ్రహ్మదేవుడు లోకక్షేమము గోరి పుష్కరతీర్థమున యజ్ఞము చేయదలచి శ్రీపతితో జెప్పెను. ఆయన,"శివుడును నేనును అన్నియు చూచుకొందుము, కాని"మ్మనెను. ముహూర్తమునిశ్చయించిరి.అందరకునుఆహ్వానములువెళ్ళెను. ముహూర్తము సమీపించుచున్నది. బ్రహ్మ, సావిత్రిని పిలుచుకొని రమ్మని యింద్రుని బంపెను. అత డామెను రమ్మని తొందరపెట్టెను. ఆమె, "పిలిచిన నా వారెవ్వరును ఇంకను రాలేదు.వారు రాగానేవచ్చెదము"అనిచెప్పెను.

ఇంద్రుడా మాటలు బ్రహ్మకు చెప్పగా ఆయన, "ముహూర్తము దాటి పోరాదు. ఎవ్వతెనైన కన్యనుజూడుము.భార్యగాగ్రహించిసంకల్పముచేసెద"ననెను.ఇంద్రుడు భూలోకమునకు త్వరగాబోయి,పెరుగు నమ్ముకొనుచున్న ఒక కన్యను చేయిపట్టుకొని బ్రహ్మయొద్దకు లాగుకొనివచ్చెను. ఆమె యేడ్చెను. కాని బ్రహ్మను జూడగానే తనవారిని, తన లోకమును మరచిపోయెను.వెంటనేవిష్ణురుద్రులు పెద్దలుగాగాంధర్వవివాహముజరిగిపోయెను.సంకల్పముచేసి యజ్ఞమునారంభించినాడుబ్రహ్మదేవుడు.గొల్లలందరునుతనపిల్లనువెదకుకొనుచుఎవరోచెప్పగా వినిబ్రహ్మలోకమునకువచ్చి,లబోదిబోమనుచుగోల పెట్టుచుండగా విష్ణు వక్కడికి వచ్చి వారితో"మీపిల్లసాక్షాతుసృష్టికర్తఅయినబ్రహ్మను పెండ్లాడినది.అంతకన్నకావలసినదేమున్నది?నేను నారాయణుడను.మీవంశములుపవిత్రమైనవి.నేనుకృష్ణుడుగాఅవతరించినపుడుమీమధ్యనే ఉండెద"ననివరమిచ్చెను.గొల్లపిల్లగాయత్రివారితో"నేనుఆనందముగానున్నాను.

విచారింపకుడ"నగావారు తమ యిండ్లకు బోయిరి. ఈ తంతు లన్నియు జరిగిన తరువాత తీరికగాసావిత్రిలక్ష్మీపార్వతులతోనుఇతరసుఖులతోనువచ్చెను.జరిగినసంగతులుతెలిసికొని మండిపడెను.ఆమెనుజూచిబ్రహ్మాదులుభయపడిరి.ఆమెబ్రహ్మను,ఒక్కకార్తికపూర్ణిమనాడు తప్ప మరెప్పుడును నిన్ను పూజించరు అని శపించెను. ఇంద్రుని జూచి, "నీవు శత్రువుల చేతిలో ఓడి అవమానములు లొందుదు"వని శపించెను. శ్రీహరిని జూచి, "నీవు రాముడ వైనపుడుభార్యావిరహమునొందము.అంతేకాదు కృష్ణుడ వైనపుడు పశువుల గాచుకొనుచు బ్రతుకు"మని శపించెను. శివుని జూచి "దారుకావనములో ముని శాపమున నీ లింగము భూపతనమైనపుంసకుడ వౌదు"వని శపించెను. అగ్నిని జూచి, "నీవు సర్వమలభక్షకుడవై రుద్రవీర్యము త్రాగుదు"వని శపించెను. తరువాత అక్కడ నున్న విప్రులను జూచి "మీరు పరాన్నభోజనులై,తీర్థక్షేత్రములందుదుర్దానములుగ్రహించుచుఅనర్హులైనవారిచేయజ్ఞాదులు చేయించుచుచివరికిప్రేతత్వమునొందెదరుగాక"యనిశపించెను.శచీదేవిమున్నగువారిని జూచి, "మీరాలస్యముచేయుటచేఈయనర్థముకలిగిన"దనుచు,శచిని,"నీవునహుషునివలనబాధపడుదు" వనియు,పార్వత్యాదులను"దేవతాస్త్రీలందరుగొడ్రాళ్ళుగానుందు"రనియుకోపావేశమున శపించి,యజ్ఞశైలమునకుబోయెను.విష్ణువామెదగ్గరకువెళ్ళిఅనేకవిధములస్తుతించిప్రసన్నురాలిని జేసికొనియాగశాలకువచ్చెనుబ్రహ్మదేవునిచేపట్టియజ్ఞమునందుయజమానురాలయియుండుటచేత గాయత్రికిదేవతామహిమలుగలిగెను.సావిత్రీశాపమునపరిదీనులైయున్నదేవతలను, ఋషులనుజూచి,"ఓమహాత్ములారా!.మీరుసావిత్రి యొసంగిన శాపములకు విచారింపకుడు.

నేను బ్రహ్మను చేపట్టిన ప్రభావముచే మీకు వరము లిత్తును. బ్రహ్మను బూజించినవారు ఇహపరసౌఖ్యములుపొందెదరు.కార్తికపూర్ణిమనాడుపూజించి ముక్తి నొందెదరు. దేవేంద్రా! నీకుతాత్కాలికముగాశత్రుబాధకలిగిననుమరలత్రిలోకాధిపత్యమునుపొందుదువు.మాధవా! నీవురామావతారములోనీభార్యనుహరించినరాక్షసునిసమూలముగ నాశన మొనరింతువు. కృష్ణుడవైపుట్టిసకలలోక పూజ్యుడ వగుదువు. శంకరా!జారి పడిన నీ లింగమే పూజార్హ మై అభిషేకింపబడుచుభక్తులకు కోరిన వరములు నిచ్చును. అగ్నిదేవా!ఎన్నిటిని భక్షించినను నీవుపవిత్రుడవేయగుదువు.అంతేకాకనీద్వారానే(ద్వారమునన)దేవతలు యజ్ఞహవిస్సులను పొందుచుందురు.బ్రాహ్మణులారా!మీరునన్నుతలచుకొన్నంతనేపాపవిముక్తులగుదురు. ఎన్నిదుర్దానములుపట్టిననుగాయత్రీమంత్రజపముచేదోషములుపోయి పవిత్రు లగుదురు. లక్ష్మీ!నీదయఎవరిమీదప్రసరించునోవాడుశ్రీమంతుడగును. పార్వత్యాది దేవకాంతలారా! మీకుసంతానములేకపోయిననుఅదుఃఖముమిమ్ము నెప్పుడును బాధింపకుండునగాక"అని అందరకునువరములిచ్చెను.అందరునుఆమెనుపరదేవతయనిస్తుతించిరి.యజ్ఞము పరిసమాప్త మైనది. ఎవరి చోటులకు వారు పోయిరి. క్రొత్త భార్య వచ్చినను బ్రహ్మకు మొదటి భార్య పై బెంగ కలిగెను. శ్రీహరిని బిలిచి, "ఆమెను నీ వెళ్లైన ప్రసన్నురాలిని జేసి తె"మ్మని పంపెను. ఆయన లక్ష్మితోపాటు వెళ్ళి సావిత్రి పాదములపై బడెను. లెమ్మన్నను లేవలేదు. "నేను అన్నిటిని క్షమించితిని. లె"మ్మనగా లేచి మాధవు డామెను స్తుతించెను. ఆమె "కేశవా!ఈ లక్ష్మి నీ హృదయముమీద నుండుచు, నీ వే యవతార మెత్తినను వెంట వచ్చుచుండును. ఇంకేమైన వరము కోరుకొ"మ్మనగా గోవిందుడు, "తల్లీ!నీ విరహముతో విరించి వేగిపోవుచున్నాడు. నిన్ను తీసికొని రమ్మని నన్ను పంపినాడు. నీవు వచ్చినచో అంతకన్న నాకు వేరే వర మక్కర లేదు"అనెను. ఇంతలో ఉమతో శంకరు డచ్చటికి వచ్చి ఆమెను స్తుతించెను. సావిత్రి "శంకరా!నీ కీ శైలజ అర్థశరీరమై యుండును.మిమ్ము సేవించినవారికి సకలైశ్వర్యములు గలుగును. ఇంకేమి వరముకావలె?"ననగాశివుడు"తల్లీ!బ్రహ్మకోరికదీర్చిఅతనికానందము కలిగింపు"మనెను. ఆమె అంగీకరించెను. లక్ష్మీపార్వతులు చెరియొక చేయి పట్టుకొని నడిపించగా ఆమె బ్రహ్మదగ్గరకు వచ్చి నమస్కరించెను. బ్రహ్మ ఆమె నాదరించి గాయత్రిని జూపి, "ఈమె నీ చెల్లెలు"అని చెప్పెను.సావిత్రి గాయత్రిని కౌగిలించుకొని "మన మిద్దరము మన నాథునికిరెండువైపులనిలిచిసృష్టి యున్నంతవరకు ఈ పుష్కరక్షేత్రమున ఉండుద"మని చెప్పెను. గాయత్రి ఆమెకు మ్రొక్కి ఆమె చెప్పినదానికి ఆనందమగా అంగీకరించెను.

## శ్రీకృష్ణుడు తన భార్యలను శపించుట

శ్రీకృష్ణుడుద్వారకలోపదియారువేలమందిభార్యలతోసుఖముగానుండెను.ఒకనాడుకృష్ణుని కొడుకుసాంబుడువిహారమునకుబోవుచుండగా,పరమసుందరుడైనవానినిజూచిపదారువేలమంది కృష్ణభార్యలు మదనతాపము నొందిరి. కృష్ణుడు దివ్యదృష్టితో అది గ్రహించి, "మీరు నీ తరువాతచోరులచేతఅపహరింపబడుదురుగాక"యనిశపించెను.వారు"మాదాల్భ్యుడను ముని కర్తవ్యము నుపదేశించును. ఆ ప్రకారము చేసి విముక్తి నొందుదు"రని చెప్పెను. ముసలముపుట్టియాదవవంశమనశించెను.శ్రీకృష్ణుడవతారముచాలించగాఅష్టమహిషులును అగ్నిప్రవేశము చేసిరి. అర్జునుడు పదియారువేలమందిని తోడుకొని హస్తినాపురమునకు వెళ్ళుచుండగా చోరులు అతనిని ఓడించి ఆ స్త్రీలనుచెరబట్టిరి.దాల్భ్యుడువారున్నచోటికి రాగా వారు, "స్వామీ!కృష్ణభార్యలమై అంత బ్రతుకు బ్రతికిన మాకు ఈ చోరుల చేతిలో పరాభవము కలుగుటకు కారణ మే"మని యడిగిరి. ఆయన "కాంతలారా!పూర్వము మీరు వైశ్వానరునిపుత్రికలు.యౌవనమదముతోనుండి,ఒకసారిజలక్రీడలాడుచుఅటువచ్చుచున్న నారదుని ఆపి, "మేము నారాయణుని భార్యలము కావలెనని కోరుచున్నాము. దానికి ఉపాయము చెప్పు"మనిరి. వినయవిధేయతలు రవ్వంత కూడ లేని మీ నడవడి జూచి యతుడు లోలోన కోపమొంది మీతో నిట్లనెను."చైత్రవైశాఖ మాసములలో శుద్ధ ద్వాదశీ దినములందువ్రతమాచరించిబంగారుపరికరములతో రెండు శయ్యలను (మంచములను) విప్రులకుదానమిచ్చినచోమీరురాబోవు28వమహాయుగములో శ్రీకృష్ణుని భార్యలగుదురు. మీ మర్యాద లేని ప్రవర్తనమువలన వేశ్య లగుదురు"అని పలికి వెడలిపోయెను. ఆ రెండు శాపములచేతను మీరు చోరులచేతిలో బడి వేశ్యాత్వము నొందినారు. ఇప్పుడైనను మీ యింద్లకువచ్చువిటులనేశ్రీహరిరూపముగాభావించివేశ్యాధర్మమునుబాలించితరింపు"డని బోధింపగా వారు వేరు గతిలేక వేశ్యాలుగా బ్రతికి దేహములు చాలించి ముక్తి నొందిరి.

## మార్కండేయునకు చిరాయువు

సత్కథలువినిపించుచున్నపులస్త్యునిజూచిభీష్ముడు,"మార్కండేయునికథనాకుచెప్పు"మని యడిగెను.అతడిట్లుచెప్పెను.పూర్వకల్పములోమృకండుడనుమునికిఒకకొడుకు కలిగెను. మృకండునికొడుకుగావునమార్కండేయుడనిపిలువబడెను.వాడుఐదుసంవత్సరముల వయసులోఇంటిముందుఆడుక1నుచుండగాఒకసిద్ధుడుఅతనివైపుచూచుచునిలువబడెను. మృకండు డాయనకు నమస్కరించి, "స్వామీ!వీడు నా కొడుకు.వీని కాయుర్దాయ మెంత? "అని యడిగెను.

సిద్ధుడు "ఇప్పుడు వీని వయ సెంత?"అని యడుగగా మృకండుడు "ఐదేండ్లు"అని చెప్పెను. "ఐనచో నింక ఆరుమాసములే ఇతని ఆయువు"అని సిద్ధుడు వెడలిపోయెను. మృకండుడు భయకంపితుడై ధైర్యము దెచ్చుకొని, మంచి ముహూర్తమున వెంటనే అతనికి ఉపనయనము చేసి, "నాయానా!విప్రులు, మహర్షులు ఎవ్వరు కనిపించినను నమస్కరించు ఆశీస్సులుపొందుచుండు"మని చెప్పెను.మార్కండేయడట్లే చేసిదీవెన లందుకొనుచుండెను. ఒకనాడు సప్తమహర్షులు మార్గవశమున అచ్చటికి రాగా మార్కండేయుడు వారికి తన గోత్రనామములుచెప్పి,"అహంభోఅభివాదమే"అనుచునమస్కరించెను.వారు"దీర్ఘాయుష్మాన్ భవ"అని దీవించి, వెంటనే దివ్యదృష్టితో జూచి, "అల్పాయుష్కుని దీర్ఘాయుష్మంతునిగా దీవించినాము. మన దీవెన వ్యర్థ మగునా?"అని సందేహించి బాలునితో సహా బ్రహ్మదగ్గరకు బోయిరి. వారు బ్రహ్మతో ఏదో చెప్పబోవునంతలో మార్కండేయుడు ముందునకు పోయి బ్రహ్మదేవుని పాదములకు నమస్కరించెను. బ్రహ్మ అతనిని "దీర్ఘాయుష్మాన్ భవ"అని దీవించెను. సప్తర్షులు సంతోషపడి, తాము వచ్చిన పని చెప్పిరి. బ్రహ్మ, బాలుని సంగతి గ్రహించి సప్తర్షులతో "ఈ బాలుడు పెద్దలకు నమస్కరించుచు ఆయుష్మంతు డయ్యెను. మన దీవెనలు నిమిత్తమాత్రములు. ఇతడు చిరంజీవియై రాబోవు ఏడు కల్పములందు నాకు జగత్సృష్టి కార్యక్రమములందు సహాయము చేయును. తపము చేసి మహాయోగి యగు"నని చెప్పెను. సప్తర్షులు వానిని ఇంటి దగ్గర విడిచి వెళ్ళిరి. మార్కండేయ డీ విషయమును తండ్రికి చెప్పెను. అతడు బ్రహ్మానంద మొందెను.

### భగవద్ గీతా మహాత్మ్యము

సగుణ నిర్గుణ పరబ్రహ్మస్వరూపమును దెలుపునది భగవద్గీత. గీతాపురుషునికి, మొదటి ఐదధ్యాయములును ఐదు శిరస్సులు. తరువాతి పదియధ్యాయములును పది బాహువులు. పదియారవయధ్యాయముఉదరము. చివరి రెం డధ్యాయములును పాదములు. ఈ విధముగా గీతసర్వమునుఈశ్వరస్వరూపము. గీతలోని ఒక అధ్యాయమైనను, ఒక్క శ్లోకమైనను, దానిలో సగమైనను,లేకదానిలోపాద(1/4)భాగమైననుజది వెడి వారికి మోక్ష మగుగలుగును. ప్రథమాధ్యాయమాహాత్మ్యము : గీతలోని ప్రథమాధ్యాయమును ప్రతిదినమును పఠించువారికి పూర్వజన్మపాపములు పోయి విష్ణులోకప్రాప్తి గలుగును. ద్వితీయాధ్యాయ ఫలము : దీనిని నిత్యముపారాయణముచేయువారికిమనశ్శాంతి గలుగును. ఆకలిదప్పులు, భయద్వేషములు కలుగవు. తృతీయాధ్యాయ ఫలము : దీనిని పఠించువారు తమ పాపములే కాక యితరుల పాపములను గూడ పోగొట్టుదురు. పంచమాధ్యాయము : మహాపాములను నశింపజేయును.

షష్ఠాధ్యాయము : అజ్ఞానమును నశింపజేసి ముక్తి కలిగించును.
సప్తమాధ్యాయము:తనకునుతనవంశములోనివారికినీహీనజన్మములు రాకుండజేయును.
అష్టమాధ్యాయము : పునరావృత్తి లేని పరమపదము నిచ్చును.
నవమాధ్యాయము : దుష్టదానములు పట్టిన దోషములు తొలగించును. యజ్ఞఫలముకన్న ఎక్కువ ఫల మిచ్చును.
దశమాధ్యాయము : పూర్వజన్మస్మృతిని, ఐశ్వర్యమును ఇచ్చును.
ఏకాదశాధ్యాయము:బ్రహ్మరాక్షసపిశాచాదిబాధలు తొలగును. భగవత్స్వరూప దర్శనము లభించును.
ద్వాదశాధ్యాయము : దీనినేకాగ్ర బుద్ధితో జపించినచో భగవత్సాక్షాత్కారము కలుగును.
త్రయోదశాధ్యాయము : దీనిని వినినచో దివ్యస్వరూపము గలుగును. జపించినచో కలుగు ఫలము వర్ణింప నలవికాదు.
చతుర్ధశాధ్యాయము:దీనినిజపించినచోపూర్వస్మృతులును,దివ్యశక్తులును గలుగును.
పంచదశాధ్యాయము:దీనినివిన్నవారికిని,జపించినవారికినిపరమాత్మస్వరూపముదెలిసిముక్తి కలుగును.
షోడశాధ్యాయము : దీనిని జపించినవారికి సర్వవశీకరణ శక్తి కలుగును.
సప్తదశాధ్యాయము:దీనినిజపించినవారికిరోగాదులను పోగొట్టు సిద్ధు లన్నియు కలుగును.
అష్టదశాధ్యాయము : దీనియందు ఐదు శ్లోకములు నిత్యము జపించినవానికి సర్వదాన ధర్మములు,యజ్ఞములుచేసినఫలమబ్బును.పూర్తిగాపారాయణముచేసినవాడుఅక్షయమైన పుణ్యము గలిగి, దానివలన జనన మరణ దుఃఖపూరితమైన సంసారబంధములనుండి విముక్తుడై వైకుంఠధామమున స్థిరముగానుండును. దేవునియెదుట చేయగూడని పనులు"దేవాలయములోగాని దేవుని యెదుటగాని చేయకూడని పనులేవి?"యని పార్వతియడుగగా శంకరు డిట్లు చెప్పెను. చెప్పులతో దేవాలయములోనికి పోరాదు. దేవోత్సములందు పాల్గొనక యుండరాదు. దేవుని కెదురుగా నిలబడి నమస్కరింపరాదు. (ఒక ప్రక్క నిలబడి నమస్కరింపవలెను.) ఎంగిలిచేతితో నమస్కరింపరాదు. పురుడు, మైల కలిగినపుడు నమస్కరింపరాదు. ఒక్క చేతితో దండము పెట్టరాదు. దేవుని యెదుట ఆత్మప్రదక్షిణముచేయరాదు.దేవునియెదుటకాళ్ళుచాపికూర్చుండరాదు. మంచముపైగాని, క్రిందగాని పరుండరాదు. దేవునికి నివేదించకుండ తినరాదు.అసత్య మాడరాదు. దేవుని యెదుట గట్టిగా అరవకూడదు.

ఒకరితోనొకరుఅనవసరసంభాషణముచేయకూడదు.ఏడువకూడదు.దెబ్బలాడుకొనకూడదు. ఎవరినిశిక్షింపరాదు.అనుగ్రహించిఆశీర్వదింపకూడదు.ఒకరినొకరుతిట్టుకొనరాదు.శాలువలు, కండువాలు కప్పుకొనగూడదు. ఇతరులను నిందించుటగాని, పొగడుటకాని పనికిరాదు. అశ్లీలపదములు ఉచ్చరింపకూడదు. అపాన వాయువు విడువరాదు. శక్తి యున్నపుడు ఉపచారములందు లోపము చేయరాదు. ఉపయోగించిన వస్తువులను, ఉపయోగించగా మిగిలినవస్తువులను దేవునికి సమర్పింపరాదు. గురువులను, దేవతలను స్తుతించునపుడు మౌనముగా నుండరాదు. తన్ను దాను పొగడుకొనరాదు. ఒక దేవాలయమున గూర్చుండి యితర దేవతలను నిందింపకూడదు.ఇవన్నియు దైవాపరాధములని చెప్పబడినవి. కనుక దైవానుగ్రహముగోరువారుఈనియమములనుపాటించిసకలశ్రేయములనుబొంద వలయును.

ఇది పద్మపురాణము

—